శ్రీరస్తు.

# సువృత్తతిలకము.



ఇది

శతావధానులు,

శ్రీపీఠికాపుర సంస్థాన విద్వత్కవులగు
వేంకట రామకృష్ణకవులచే రచియింపబడినది.

మొదటికూర్పు.


కాకినాడ

1913

శ్రీసుజనరంజనీముద్రాక్షరశాలయందు
పోలాప్రగడ బ్రహ్మశంకరరావుచే ముద్రింపబడి
గ్రంథకర్తలచే బ్రకటింపబడియె.

వెల 0-1-0.

శ్రీరస్తు.

# సువృత్తతిలకము.

## ప్రథమవిన్యాసము.



చ. గిరిపతిపుత్త్రి పంచశర • కేళుల నీసుజనింపఁగా గణే
శ్వరగురుఁ గేరి విభ్రమవ • శమ్మునఁ బత్కచముఁ గ్రహించుచోఁ
గరరుహరేఖ పాతె ననఁ • గా దయివారెడు చంద్రమఃకలాం
కుర మహారత్నరంజిత మ • కుంభసుఖమ్ముల మీకొసంగుతన్.

మంజరి. స్వచ్ఛందలఘురూపు • జగదేకగురుని
స్పష్టవామనవృత్తుఁ • జక్రిని దలఁచి
ఛందోనిధానము • సద్వృత్తవేద
సూనృతావాసు వ్యా • సుని గొనియాడి
శిష్యశిక్షార్థమై • క్షేమేంద్రసుకవి
విరచించినట్టి సు • వృత్తతిలకముఁ
బరికించి యది మేలు • బంతిగా నేము
రామకృష్ణులము వా • గ్రామణిష్టులము
పావనంబు మొక్కంతే • యాంధ్రవాఙ్మయము.

క. ఛందమ్ముల నారసి త
త్సౌందర్యమ్ముఁ గణించి • సత్కావ్యములన్
పొందువడిన వృత్తమ్ముల
నెందుఁ గవుల్వాగడ సంగ్ర • హించెద మిందున్.

గణయతిప్రాసలక్షణంబులు ప్రాచీనగ్రంథమ్ముల నెఱుంగునది.

దశమచ్ఛందమ్మగు పఙ్క్తియందు—

పర్వెన్ మ్నయ్గులు ◆ పణవం బయ్యెన్.

UUU మ, III న, IUU య, U X ఆఱింట యతి.

నీయుల్లం బోక ◆ నియతిం గార్యం
బాయ త్తంబుగ ◆ ననుసంధింపన్
జేయం జాలవు ◆ చెదుఱ్ఱోవంబోఁ
బాయంద్రోవవు ◆ బలిమిం బుత్త్రిన్.

శ్రీపర్వము.

క్రాలన్ శుద్ధవి ◆ రాట్టు మస్జగల్

UUU మ, IIU స, IUI జ, U X- ఆఱింట యతి.

ఉల్లం బప్రియ ◆ మొందఁ గ్రొత్త సం
ధిల్ల న్నెవ్వగ ◆ దీన వక్త్రుఁ డై
యొల్లం బోవుచు ◆ నున్నె నవ్విభుం
డల్లం గౌఁగిట ◆ నాన్నృపాలకున్.

శ్రీపర్వము.

ఏకాదశ చ్ఛందం బగు త్రిష్టుప్పునందు—

తా నింద్రవజ్రం బగుఁ ◆ దాదగాలన్

UUI త, UUI త, IUI జ, UX, UX- ఎనిమిదింట యతి.

చింతాపరత్వంబునఁ ◆ జెందు దుఃఖా
క్రాంతత్వ ముర్వీశ్వర ◆ కాన నెప్డున్
జింతింపఁ డార్యాత్ముఁ డ ◆ చింతనుం డై
యంతఃపరీతాపము ◆ నార్పఁ జాలున్.

శ్రీపర్వము.

ఉపేంద్రవజ్రన్ జత ◆ లొప్పు జ్గాలున్

IUI జ, UUI త, IUI జ, UX, U X- ఎనిమిదింట యతి.

మరుత్తనూజుం బరి ♦ మార్పఁ జూచుం
బరి స్ఫురత్కోపని ♦ బద్ధుఁ డై యి
ద్ధరావిభుం డం చిది ♦ తల్ల నే సం
స్మరించి యీ కోపున ♦ మర్చికొంటిన్.

స్త్రీపర్వము.

పైరెంటి పాదమ్ములఁ ♦ బట్టి యెం దు
చ్చరింతు ర ద్దా నుప ♦ జాతి నాఁ గన్.

మునీంద్రి నిర్భాగ్యత ♦ ముట్టి చావం
గా నేరదయ్యెం గడు ♦ గట్టిచిత్తం
బనూనమూర్ఛం దెగ ♦ టాఱియుం దా
రా నేర్చె నిమ్మేనికిఁ ♦ గ్రమ్మఱంగన్.

స్త్రీపర్వము.

వాఱిలు రేఫ న ర ♦ వల్ రథోద్ధతన్
∪ | ∪ ర, | | | న, ∪ | ∪ ర, | ∪ వగణము. ఏడింట యతి

హారహీర ధవ ♦ ళాంశు నిర్మలో
దారకీర్తి రణ ♦ దర్ప సద్గుణా
వార వీరనిర ♦ వద్య మన్మథా
కార ధీర పర ♦ గండభైరవా.

సభాపర్వము.

స్వాగతంబు రన ♦ భల్ గగ యొప్పన్.
∪ | ∪ ర, | | | న, ∪ | | భ, ∪ గ, ∪ గ- ఏడింటయతి

వేగవంతుఁ డను ♦ వీరుఁడు సాంబున్
వేగవంతుఁ డయి ♦ వీఁకను దాఁకెన్

వేగబాణపర • పీతతులఁ దీ
గ్భాగముల్ విశిఖ • పంజరముల్ గాఁ.

ఆరణ్యపర్వము.

భద్రియిద్రోధకి • పద్యము గాయుఁ.

U I I భ, U I I భ, U I I భ, U U గగము- పదింట యతి

మానుమజన్మము • మాన్య వివేకా
మానవ దుఃఖస • మాజము నెల్లఁ
దాన ఘటించుచు • దైన్యముఁ దెచ్చుం
గాన భవం బిది • గాల్పన తండ్రీ!

స్త్రీ ర్వము.

ద్వాదశచ్ఛందమ్మగు జగతియందు—

వరఁ దోటకవృత్తము • నాల్గు సలఁ

I I U స, I I U స, I I U స, I I U స. తొమ్మిదింటయతి.

నిరవద్య నరేశ్వర • నిత్యనిరం
తరధర్మమతీ గుణ • ధామ జగ
త్పరిపూరితకీర్తీ వి • భాసి విభా
కరతేజ నృపోత్తమ • కాంతినిధీ!

ఆదిపర్వము.

మఱియు—

సతతంబును శిష్యులు • సద్వినయా
న్వితులై ప్రణమిల్లెడు • వీరి పద
ద్వితయంబు గదుం జెడఁ • దిన్నవి సూ
చితె నక్కలు దైవము • చెర్చెఁ గటా!

స్త్రీపర్వము.

ద్రుతవిలంబిత ♦ మగు నభభ్రముల్.

| | | న, — | | భ, — | | భ, — | — ర- ఏడింట యతి.

త్రిభువనాంకుశ ♦ దీప్తినిధీ సమ
స్త భువనాశ్రయ ♦ ధర్మధురంధరా
శుభయశః పరి ♦ శోభితపూర్వది
క్ప్రభు విలాస కృ ♦ పారసబంధురా.

ఆదిపర్వము.

మఱియు—

చనఁగ నాతఁడు ♦ సాత్యకి వాయునం
దనుఁడు గాండివి ♦ తమ్ములు సూతులం
దనరి శౌరియు ♦ సంభృతశోకులై
చనియెఁ జుట్టపుఁ ♦ బానలు చుట్టిరా.

స్త్రీపర్వము.

భుజంగప్రయాతం బ ♦ గున్ నాల్గు యాలన్

| — — య, | — — య, | — — య, | — — య.

ఎనిమిదింట యతి.

వినీతుండవై ధర్మ ♦ వేదిత్వబుద్ధిం
దన ర్పొందు నీ విట్లు ♦ దైన్యాతిరేకం
బునం బొంగి శోకాగ్నిఁ ♦ బొక్కంగఁ గుంతీ
తనూజాగ్రజుం డాత్మఁ ♦ దాఁ గుందకున్నే.

స్త్రీపర్వము.

రద్వయిన్ రద్వయిన్ ♦ స్రగ్విణీవృత్త మౌ.

— | — ర, — | — ర, — | — ర, — | — ర.

ఏడింట యతి.

ఏము నీ పుత్త్రుచే ♦ నెన్నియేఁ భంగులఁ
వేమఱుం బాటు నీ ♦ వెంట భావించుచుఁ
సామసంపాది వై ♦ సైఁచు మా తప్పులఁ
ధీమహత్త్వంబు సం ♦ ధిల్లు నీ కెమ్మెయిఁ.

స్త్రీపర్వము.

లలితపదంబు సె ♦ లంగు న జాయల్

I I I న, I ⌣ I జ, I ⌣ I జ, I ⌣ ⌣ య. ఎనిమిదింట యతి.

తమ తమ తప్పులఁ ♦ దారెరియం గా
విమలమతీ యిటు ♦ వీరికి నైశో
కమున దహింపఁ గఁ ♦ గాదు మనంబుఁ
సముచిత మిత్తెఱఁ ♦ శాంతత సుమిత్రా

త్రయోదశచ్ఛందం బగు నతిజగతియందు—

భర్గభగమ్మృలం జలద ♦ పద్య మగుఁ.

⌣ I I భ, ⌣ I ⌣ ర, I I I న, ⌣ I I భ, ⌣ గ. పదింట యతి.

నీ పలు కెల్ల నిక్కమ య ♦ నింద్యగుణా
యీ పురుషార్థహాని నుతు ♦ లెల్లుటకుఁ
దాపముఁ బొంది తాల్మిఁ దిగఁ ♦ ద్రావి మహా
కోపుఁడ నైనఁ బాటిల్లఁ ద ♦ గుం గినియఁ.

మహి నజ్సజల్గురువు ♦ మంజుభాషిణికి

I I ⌣ స, I ⌣ I జ, I I ⌣ స, I ⌣ I జ, ⌣ గ. తొమ్మి
దింట యతి.

ధన మంతయుం బొలియ ♦ దారుణంబుగాఁ
దనయవ్రజంబు దెగ ♦ దైన్యమారఁగాఁ

దనబంధు లందఱు మ్మ ♦ తంబుఁ బొంద నె
వ్వని నైన శోక మను ♦ వహ్ని గాల్పదే.

స్త్రీపర్వము.*

చతుర్దశచ్ఛందం బగు శక్వరియందు—

ఒప్పు భజసల్ వనమ ♦ యూరము నగాలుఁగ.

◡ | | భ, | ◡ | జ, | | ◡ స, | | | న, ◡, ✕ ◡ ✕.

తొమ్మిదింట యతి.

రాజకుల శేఖర ప ♦ రంతప వివేక
భ్రాజిత జగద్వలయ ♦ భాసురసముద్య
త్తేజ నిరవద్య సు ♦ ధతీమదన వీరో
గ్రాజవిజయా త్రిభువ ♦ నాంకుశ నరేంద్రా.

ఆదిపర్వము.

మఱియు—

పార నారద లస్త్రిపరి ♦ పూతముగ క్షీరో
దారతఁ బిత్రాదికిఁ బ ♦ దం బడక దృప్య
ద్వైరితతి నొంచి చెగు ♦ వా రగుట మే లు
వ్వీరమణాకోటి కని ♦ వేదములు సెప్పఁగ.

స్త్రీపర్వము.

త్రిలుఁగ వసంతతిల ♦ కం దభజల్ జగాలుఁగ

◡◡ | త, ◡ | | భ, | ◡ | జ, | ◡ | జ, ◡◡

గగము- ఎనిమిదింట యతి.

ఈ బాలు న త్తొని ♦ యింటికిఁ బన్న నన్నుఁ గా
నా బంధు లందఱు మ ♦ నంబున నేమి నారే

యీబాలు సూర్యనిభు ♦ నిట్టుల పెట్టి పోవం
గా బుద్ధి పుట్ట దని ♦ కన్య మనంబులోనన్.

ఆదిపర్వము.

రహిం ననభనవల్ ♦ ప్రహరణకలితన్

| | | న, | | | న, ◡ | | భ, | | | న, | ◡ వగణము-

ఎనిమిదింట యతి.

ఇది యిటు లగు ట ♦ క్లిష్టిఁగి పలికె నా
విదురుఁడు సభఁ గో ♦ విదులు వొగడఁ గా
నది వినియును నే ♦ నడపని దురితం
బొదవెఁ గలనఁ జే ♦ టొలయ కుడుగు నే

స్త్రీపర్వము.

పంచదశచ్ఛందంబగు నతిశక్వరియందు—

ననమయయుల నొప్పున్ ♦ మాలినీవృత్త మెన్నన్

| | | న, | | | న, ◡◡◡ మ, | ◡◡ య, | ◡◡

య- తొమ్మిదింట యతి.

సురపతిసభఁ జూడం ♦ జూడ నంగారవృష్టుల్
గురిసెఁగులిశధారల్ ♦ గుంఠితంబయ్యె దిక్కుం
జరమదము లడంగెన్ ♦ సర్వదిక్పాలకాంతః
కరణములు భయోద్వే ♦ గంబునన్ సంచలించెన్.

ఆదిపర్వము.

మణిగణనికరము ♦ మహిం ససననసల్

| | | న, | | | న, | | | స, | | | న, | | ◡ స- తొమ్మిదింట యతి.

గొడుగులపఙ్క్తియులు ♦ గురుకులు గొనుటన్
సిడములతునియలు ♦ సెదరి యునికిఁ బెం

దడఁ బడి పడగలు ♦ దఱచు మ్మురియు నై
పుడమిఁ గలయుటకుఁ ♦ బోగు లొలయు మదిన్

స్త్రీపర్వము.

అంగమైన మణిభూషణ ♦ హా రనభారలన్

U I U ర, I I I న, U I I భ, U I I భ, U I U

గ, పదింట యతి.

రామవిక్రముఁ డజేయుఁడ ♦ రాతిగజావ్ర
సామజాహితుఁడు సాంబుఁడు ♦ సాల్వచమూపతిన్
క్షేమవృద్ధి యనువాని న ♦ కృత్రిమసాహసో
ద్దాముఁ దాఁకె శరధారల ♦ ధాముణిఁ గప్పుచున్

ఆరణ్యపర్వము.

షోడశచ్ఛందమ్మగు నష్టియందు——

నభజజాగలుగ ♦ నందగుఁ బద్మకమందొగిన్.

I I I న, U I I భ, I U I జ, I U I జ, I U I జ,

U గ, ఎనిమిదింట యతి.

కొడుకుపల్కువిని ♦ కూడదు నాకదురాత్ముఁడై
కడఁగిమీకునప ♦ కారముసేసిధరిత్రివె
ల్వడఁగఁబరిచెఁగడుఁ ♦ బాపమతిన్ ధృతరాష్ట్రుఁడె
య్యెడలమర్జనుల ♦ నేఘటినమ్మఁగఁ బోలునే.

ఆదిపర్వము.

మొలఁగెడు నజ్భ జర్గములు ♦ మేదినిం గనంగన్.

I I I న, I U I జ, U I I భ, I U I జ, U I U ర, U గ,

పదునొకంట యతి.

విను మిటు లేటికిం జనిన ♦ వృత్త మూఁది యల్లఁగా
జనము నుతించు నీదు గురు ♦ సారధీరబుద్ధిఁగా
విను నతిశాంతచిత్తయని ♦ నిక్క మేను గంటి నా
న్మనసమున నిట్టి నీకగునె ♦ మత్సరంబు నతాన.

స్త్రీపర్వము.

రహిం జెప్పన్ వచ్చున్ యమనసభవల్ ♦ రాన్ శిఖరిణిన్.

I U U య, U U U మ, I I I న, I I U స, U I I భ
I U వగణము. పదుమూఁడింట యతి.

తపస్స్వాధ్యాయాది స్ఫురితమతిచి ♦ త్తప్రకలితా
విపజ్జాలజ్వాలా విశమనసుధా ♦ వృష్టిలలితా
జపాపుష్పశ్రీరచ్ఛవిరకరణాసం ♦ సర్జనధురా
సహర్యావిర్భావా స్తవకలిత ♦ స్థైర్యముసురా.

స్త్రీపర్వము.

జసల్ జసయవంబులున్న దువఁ ♦ జక్కఁగాఁ బృథ్వియా.

I U I జ, I I U స, I U I జ, I I U స, I U U య,
I U వగణము. పంద్రెండింట యతి.

అమూల్యమణిభూషణమ్ములు గ ♦ జాశ్వబృందంబులున్
సమృద్ధధనధాన్యరాసులుఁ బ్ర ♦ శస్తగోవర్గముం
గ్రమంబునను భూసురేంద్రులక ♦ గన్యాఫలార్థినై
యమర్త్యనిభుఁ డిచ్చెఁ బాండువిభుఁ ♦ డత్యుదారస్థితిన్.

ఆదిపర్వము.

## ప్రథమ విన్యాసము

నజభజజల్ వయుం గలయ ♦ నర్కుటవృత్త

| | | న, | U | జ, U | | భ, | U | జ, | U | జ, | U

నగణము- పదునొకంట యతి.

వినుము మరుత్తనూభవుఁడు ♦ విశ్రుత ధర్మగతిం
జనక కుహస్తితీశ్వరునిఁ ♦ జంపె గదాసమరం
బున నది యే మెఱింగి చని ♦ పోయిన రేయిఁ గనుం
గనలున ముట్టి ముప్పురము ♦ గౌర్యము దగ్రిముగన్.

శ్రీపర్వము.

మందాక్రాంతన్నిలుకఁగదగున్ ♦ మభ్నతల్ తంబుగాయున్.

U U U మ, U | | భ, | | | న, U U | త, U U |
త, U U గగము. పదునొకంటయతి.

వీణానాదప్రీతమునిగమా ♦ విశ్వవత్సారఘాణ్యా
శ్రీశీరంపాదితవిమలతా ♦ క్షేమనిక్షేపచిత్త
తాంత్రిణక్రీడాకలనసతతా ♦ త్సాహవద్దివ్యభావా
ప్రాణాపానావాహరణనిపుణా ♦ ప్రాపణేయానుభావా.

శ్రీపర్వము.

అష్టాదశచ్ఛందంబగు ధృతియుందు.

మానుగా రసజాభరేఫల ♦ మత్తకోకిల వృత్తమౌ.

U | U ర, | | U స, | U | జ, | U | జ, U | | భ
U | U ర, పదునొకంటయతి.

ఆదిదేవుఁడవైననీవు ద ♦ యామతిం బొడసూపి న
న్నాదరించుటఁ జేసి ధన్యుఁడ ♦ నైతి నింతకు నెక్కుడౌం

దేది గల్గెడు నైననామది ♦ యెల్లవాఁడును గ్రోధమో
హాదులం బెడఁబాసి ధర్మువు ♦ నందు నెక్కొనఁజేయవే.

ఆరణ్యపర్వము.

ఏకోనవింశచ్ఛందంబగు నతిధృతి యందు—

సౌరార్కల్ మసజస్తతమ్ములు గముల్ ♦ శార్దూలవిక్రీడితల్.

U U U మ, I I U స, I U I జ, I I U స, U U
త, U U I త, U గ. పదుమూఁడింట యతి.

రాధేయుండును మన్ననేయఁడును బో ♦ రం బ్రాపుగాఁ బాండవ
క్రోధజ్వాలల నార్తు నొండొకఁడు నా ♦ కుం దోడు నీవింక నా
బాహం బెట్టకు వాఁడిసూది మొనమో ♦ పంజాలు నంతేని నే
నీనాత్రీతలమీనువారలకు నా ♦ కేలింత సేగింబడల్.

ఉద్యోగపర్వము.

ఎలమి నభ్రసజాగముల్ వచి ♦ యింపఁగాఁ దరళంబగున్.

I I I స, U I I భ, U I U ర, I I U స, I U I జ,
I U I జ, U గ. పండ్రెండింట యతి.

కులపవిత్రసితేతరోత్పల ♦ కోమలామలవర్ణయు
త్పలసుగంధి లసన్మహోత్పల ♦ పత్త్రినేత్ర మదాలికుం
తలవిభాసిని దివ్యతేజముఁ ♦ దాల్చి యొక్క కుమారి ద
జ్జ్వలనకుండమునందుఁ బుట్టెఁ బ్ర ♦ సన్నమూర్తి ముదంబుతోన్.

వింశచ్ఛందంబగు కృతియందు—

మహిఁ గూర్పందగు సభ్రనమ్యవములన్ ♦ మత్తేభవిక్రీడితల్.

I I U స, U I I భ, U I U ర, I I I న, U U U
మ, I U U య, I U వ, పదునాలుగింట యతి.

ఏకవింశచ్ఛందంబగు ప్రకృతియందు—

నజభజజజ్జరేఫలఁ బె ♦ నంగొనఁ జంపకమాల యయ్యెడిన్.

।।। న, । U । జ, U ।। భ, । U । జ, । U । జ, । U । జ, U । U ర, పదునొకంట యతి.

వినుమునరేంద్ర విప్రుఁడని ♦ నేర్చె జమదగ్నిసుతుంకడ శాపము
న్పెనమరభర్త వంచనము ♦ సేసె వరంబని కోరి కుంతి మా
న్పె నలుక భీష్ముఁ డర్ధరథుఁ ♦ జేసి యడంచెఁ గలంచె మద్రరా
జనుచితమాడి శౌరివిధి ♦ యయ్యె ననుండటఁ జంపెఁ గర్ణునిన్.

శాంతిపర్వము.

మ్రభ్నల్ నాల్గున్ యకార ♦ త్రయమును బలుకన్ ♦ స్రగ్ధరా వృత్తమయ్యెన్.

U U U మ, U । U ర, U ।। భ, ।।। న, । U U య, । U U య, । U U య, ఎనిమిదింట, మఱల నెనిమిదింట యతి.

అంతం గాంతేయుఁ డత్యా ♦ యతభుజుఁ డనఘుం ♦ డల్గి పాంచాలు సంగ్రా
ధ్వాంతంబున్ వానివాహా ♦ త్రిమతుహినతతిం ♦ దద్భటోదారతారా
సంతానంబున్ శరాంశూ ♦ చ్చయవిభవములన్ ♦ శాంతిఁ బొందించి యుక్త
ధ్వాంతారాతిప్రభుండై ♦ తనరుచు వెలిఁగెం ♦ దద్రణవ్యోమవీథిన్.

ఆదిపర్వము.

ద్వావింశచ్ఛందమ్మగు నాకృతియందు—

స్తభనసాగ్రిగమ్ములం(గ ♦ చ్ఛుఁ బలుక మహా ♦ స్రగ్ధరావృత్తమయ్యెన్.

I I U స, U U I త, U U I త, I I I న, I I U స, U I U ర, U I U ర, U గ. తొమ్మిదింట, మఱల నెనిమిదింట యతి.

అతిరౌద్రాకారశీలా ♦ యతదవదహనో ♦ గ్రాగ్రసేనానిపీడా
హతుల్తైనానావిధోపా ♦ యనములుగొనిసో♦హార్ద్రవాంఛన్ జయశ్రీ
శ్రితబాహుంగానఁగావ ♦ చ్చిరిసకలజగ♦త్సేవ్యమానున్ మహేంద్ర
ప్రతిముం గౌరవ్యవంశ ♦ ప్రభునఖిలమహీ♦పాలునాంబాలికేయున్.

ఆదిపర్వము.

ఏడుభకారములొక్కగముల్ వచి♦యించినమానిని యండ్రుకవుల్

U I I భ, U I I భ, U I I భ, U I I భ, U I I భ, U I I భ, U I I భ, U గ. పదుమూట యతి.

ఏచి తనర్చి తలిర్చినక్రొవ్వులు♦నిమ్మగుశాఖల జొంపములన్
చూచినమంచి యశోకములన్ సుర ♦ పొన్నలఁబొన్నలగేదఁగులం
గాచి పెడంగుగఁబండిన యూసహా ♦ కారములం గదళీతతులం
జూచుచు వీనులకింపెసఁగన్ విను ♦ చున్ శుకకోకిలసుస్వరముల్.

ఆదిపర్వము.

త్రయోవింశచ్ఛందమ్మగువికృతియందు—

సగణమునాఱుజలున్ వముఁగూరిచి ♦ సంగవిరాజవిరాజితమౌ.

I I I న, I U I జ, I U I జ, I U I జ, I U I జ, I U I జ, I U I జ, I U వ. పదునాల్గింటయతి.

రజనికరాననఁ బీనపయోధర ♦ రాజితరాజసుతన్ విలస
ద్గజపతిగామినిఁ ఝంకృతగంధిఁ బ్ర ♦ కాశితకాంతిసమన్వితఁ బం

కజనళగోచరఁజూచి కిరాతుఁడు ♦ కామనిశాతశరాహతుఁడై
నిజహృదయుం బెత్రఁగించె లతాంగిక ♦ నింద్యచరిత్రకు వేమకతోన్.

ఆదిపర్వము.

మత్యకోనానాసకో మకువంగా ♦ మహిదసరసిజము ♦ మనుగవిహితమై.

U U U మ, U U | త, | U U య, | | | న, | | | న, | | | న, | | | న, | | U స. పదింట, మఱలఁ దొమ్మిదింట యతి.

శ్రీరమ్యత్వం బారఁగఁ బెంపూ ♦ ర్జితముగ మణివిర ♦ చిత ముకుటములుం
హారంబులుఁ దాల్పన్ సారవిభూతిన్ ♦ నృపసుతులనిమిష ♦ ధవనిభులగుచున్
భూరిశ్రీతోన్ సూరెలుఁగొల్వన్ ♦ భువనవినుతమగు ♦ పొలుపు వెలయము
న్నారాజేంద్రుల్ దారుణదైవం ♦ బిటు ఘటనము సేసెదె ♦ నిరసింగట కటా!

స్త్రీపర్వము.

పాంచితలీలం గ్రొంచపదంబో ♦ భమసభనననయ ♦ పరిచితమగుచున్.

U | | భ, U U U మ, | | U స, U | | భ, | | | న, | | | న, | | | న, | U U య, పదునొకంట, మఱలఁ దొమ్మిదింట యతి.

కౌరవసేనావీరులు లావుం ♦ గడిమియుఁ జలమును ♦ గడఁక యొలర్పన్
ధీరతఁ బోరం గ్రూరత పెంపుం ♦ దెగువయు నెఱపఁగఁ ♦ దెరలక వీఁకన్
ఘోరసంగ్రామంగా రభసం బే ♦ పున గలితసమును ♦ బొలుపు వహింపన్
వారభయంబుం గూరుటకుంగా ♦ వలసె నరుధిరము ♦ వదనము సేర్పన్.

స్త్రీపర్వము.

# ప్ర థ మ వి న్యా స ము

పంచవింశచ్ఛందంబగు నతికృతియందు—

బలయునసనన, నసభభభగురువులన్ ♦ బంధురవృత్తము సెప్పఁదగున్.

| | | న | | | న | | | న | | | న | | ⌣ స ⌣ | | భ ⌣ | | భ ⌣ | |

భ ⌣ గ పదియాఱింటయతి.

సకలరథములును సఖలజగములున్ ♦ సర్వహయంబులతో బెరయన్
శకలములు గభటనికర మఖిలముఁ ♦ జావఁగ ద్రౌపది పుత్త్రులలో
నొకరుఁడు బ్రతుకక పొడిపొడియుఁగన ♦ య్యుర్వికినారలమామలమ
స్తకములు కసమ వడకవడి బలిగా ♦ సంతసమందఁ బిశాచతతుల్

స్త్రీపర్వము.

భాస్కరవిలసిత వృత్తమెసంగున్ ♦ భన్జయ భననసగలుసమకూర్పన్

⌣ | | భ | | | న | ⌣ | జ | ⌣ ⌣ య ⌣ | | భ | | | న | | |

న | | ⌣ స ⌣ గ పదుమూడింటయతి.

కౌరవనృపతి తనూజశతంబుం ♦ గాంచెపవన సుతుపటుభుజలీలా
ఘోరతఁదడఁబడ మేదిని మీఁదం ♦ గూలె వికటముఖకరచరణంబై
యేరికైనఁ గనుఁగొన్న విషాదం ♦ బెంతయుమది నెలయఁగఁ బ్రియకాంతల్.
చేరివిలపనముసేద్దయునారిం ♦ జేయఁ గనునికి ననట తిరిఁ బెటన్

స్త్రీపర్వము.

షడ్వింశచ్ఛందంబగు నుత్కృతియందు—

చక్కఁగ భజస్న భజ ♦ సన్గగలు సెప్పునెడ ♦ సత్కవికిమంగళమహాశ్రీ

⌣ | | భ | ⌣ | జ | | ⌣ స | | | న ⌣ | | భ

| ⌣ | జ | | ⌣ స | | | న ⌣ ⌣ గగ తొమ్మిదింట మ

రలఁదొమ్మిదింట యతి.

ఈతఁడు రణంబునకు ◆ నెత్తిచనుచుండియును ◆
నెంతయును భక్తిఁ గనినాఁకుం
బ్రీతియొసఁగంబలికి ◆ ప్రేమమొలయం బొగడి ◆
పెద్దయువినీతి నిరతుండై
చేతులు మొగిడ్చి జయ ◆ సిద్ధియుఁగ దీవనవి ◆
శిష్టదయ నిమ్మనిన ధర్మం
బేతల ననూనమగు ◆ నిద్ధజయమాతలకు ◆
నెట్లయిన సిద్ధమగునంటిఁ.

స్త్రీపద్యము.

మాలికావృత్తములందు—

సమ్మతిమెయిం భజస ◆ నమ్మలపయిం భజస
నమ్మలఁ గ్రమమ్మునభ ◆ యమ్మల, లయగ్రా
హిమ్మలపివ్రాసపిర ◆ మమ్ములను నాలిగిటి
నెమ్మినికుదుర్ ప్రతిప ◆ దమ్మునఁ గవీంద్రుల్

U । । భ । U । జ । । U స । । । స U । । భ । U
। జ । । U స । । । స U । । భ । U U య. తొమ్మిదింటఁ
దొమ్మిదింటఁ వొమ్మిదింటఁ బ్రాసయతి.

కమ్మనిలతాంతముల ◆ కుమ్మనసివచ్చు మధు
పములసుగీతనిన ◆ దమ్ములెసఁగం జూ

తమ్ముల లసత్కేసర ♦ యమ్ముల సుగంధిముకు
శమ్ములను నానుచు ము ♦ దమ్మొనరవాచా
లమ్ములగు కోకిలకు ♦ లమ్ములరవమ్ము మధు
రమ్ముగుచు వీచెనని ♦ శమ్ము సుమనోభా
రమ్మున నశోకనిక ♦ రమ్ములును జంపక చ
యమ్ములు నుగింశుకవ ♦ నమ్ములును నొప్పెన్.

ఆదిపర్వము.

నసిపడఁగఁ బ్రాసయతు ♦ లొనఁగి సలుమాఱు వెస
ససన నసనంబులును ♦ నసన వసనంబుల్
పిసువక రచించు నెడ ♦ నసదృశమనంగఁ దగు
పసలయ విభాతియగు ♦ రసికజనులారా!

| | | న | | ◡ స | | | న | | | న | | ◡ స | | | న
| | | న | | ◡ స | | | న | | | న | | ◡ స | | | న ప

దింటఁ బదింటఁ బదింటఁ బ్రాసయతి.

అరయనిది పెద్దయని ♦ యతుల మొనఁజత్తమున
సరకు గొనకుగ్రమగు ♦ బరవస మెలర్పం
ద్వరితగతిఁ జొచ్చి కురు ♦ వరుఁడు వలఁ కఁగవిసి
కరతతులు భేరులని ♦ కరములుఁ దురంగో
త్కరములును గాల్బలము ♦ నరవరులుఁ గీడ్పడఁగ
శరగురుఁడుఁ గర్ణుడును ♦ గురుసుతుఁడు మద్రే
శ్వరుఁడుఁ గృపుఁడుం బఱపఁ ♦ బరఁగిది విజల్వోగడ
ధరఁబడి ముకుందఁ మన ♦ నరతనయుఁడొప్పెన్.

స్త్రీపర్వము.

ఆరంభమందుండ కారంబు గానీ న కారంబు కానీ స కారంబుకానీ హ కారంబు కానీ ఘటింపం దగుఁ గా మీఁద నల్లం ద కారంబె వల్కంగఁ బోలుం గ కారావసానంబుగా; దీనినే దండకం బండ్రు విద్వన్మణుల్.

త, న, స, హ, గణములలో నొకటి మొదలనిడి, తక్కిన వన్నియుఁ దగణములే కూర్చి చివరనొక గురువు పెట్ట వలయును. యతి ప్రాస నియమము లేదు.

శ్రీకంఠ లోకేశ లోకోద్భవ స్థాన సంహారకారీ పురారీ మురారిప్రియా చంద్రధారీ మహేంద్రాది బృందారకానంద సందోహ సంధాయిపుణ్యస్వరూపా...సురభ్యార్చితా నాకుసభ్యర్థితంబుల్ ప్రసాదింపు కారుణ్య మూర్తీ త్రిలోకైకనాథా నమస్తే నమస్తే నమః

ఆరణ్యపర్వము.

జాతులందు—

గగభజసనలలఁగండం
బగు,మూఁడైదును బదముల్ • లాదిటసలజల్
దగు; సరిని మూఁటిపైయతి;
జగణము బేసింబడదు; కొ • సనీగురువొప్పున్.

గగ, భ, జ, స, నల, ములఁ గందముఁ జెప్పనగును. మూఁడు గణములొక పాదము నైదు గణములొక పాదమునగును. మొదటి నుండి యాఱవగణము నల, జ, గణములలో నొకటి గావలయును. రెండవపాదమునందు మూఁడుగణములమీఁద యతి నిలుపవలయును. జగణము బేసి గణమెప్పుడుగాఁ జనదు. కొసయందు(అనగా రెండవపాదముతుదను) గురువుండును. ఇదిపూర్వార్ధము. ఉత్తరార్ధము నిట్లే యెఱుంగునది.

౪. సారథియు రథియు నై రొక
తేరం గృష్ణు లతిఘోర ♦ తేజస్సార
స్ఫారతఁ దోఁచిన నైనను
ధీరత వాటించి పిదపఁ ♦ దెలిసెదవు బలే.

ఉద్యోగపర్వము.

ఊహ సేయ సూర్యగణము ♦ లొప్పు నేడు, గురువు,ను
త్సాహ వృత్తమందు యతి పొ ♦ సంగు నాలుగింటిపై

ఏడు సూర్యగణములు నొకగురువు. నాలుగుగణముల మీఁదయతి.

ఏల దీని నెడయుఁ జేయ ♦ నీక్షణంబ యేఁగి పాం
చాలుఁ బట్టి తెత్త మధిక ♦ శౌర్యలీల మెఱయఁగాఁ
బోలు ననుచుఁ బెరిఁగి రాజ ♦ పుత్త్రు లెల్ల నరిగి పాం
చాలుపురము ముట్టికొనిర ♦ సంఖ్యబలసమేతులై.

ఆదిపర్వము.

ఇంద్రులుముప్వురు ♦ నినుఁదొకఁడట్టు
లింద్రులు ముప్వురు ♦ నినుఁడునొక్కండు
గ్రందుగా రెండేసి ♦ గణములమీఁదఁ
గడుకొనియతినిల్పఁ ♦ గ్రాలుఁదరోజ.

3 ఇంద్రగణములు 1 సూర్యగణము 3 ఇంద్రగణములు 1 సూర్యగణము. రెండేసిగణములమీఁదఁయతి. ఇదియొకపాదమగును. తక్కిన పాదములు నిట్లే.

ఏలయమ్మనినాకు ♦ నిచ్చెనిమ్మంత్రి
మిమ్మంత్రశక్తియే ♦ నెఱుగంగవేఁడి
యేలపుత్త్రుకుఁగోరి ♦ యెంతయుభక్తి
నినుఁదలంచితిఁబ్రీతి ♦ నినుఁడునునాకు

వేలసద్యోగర్భ • మిచ్చెఁ గుమారుఁ
డేలయిప్పుడయోడ • యుంచెనింకెట్టు
లీలోకపరివాద • మేనుడిగింతు
నింతకు నింతయు • నెఱుఁగరె జనులు.

ఆదిపర్వము.

ఇరువు రింద్రులు సూర్యుఁడొకఁడు వెలయఁగా • నవకొల్పియుల్ల
మఱిఁ గూర్చి నాల్గింటి మీఁద యతి నిల్ప • మధ్యాక్కరంబు.

ఇంద్రగణములు రెండు, సూర్యగణ మొకటి, మరల నింద్రగణములు రెండు, సూర్యగణ మొకటి, నాలుగు గణములమీఁద యతి.

అవసరజ్ఞుం డయి వ్యాసుఁ డేతెంచె • నంత నత్తపసి
కవిలగడ్డంబును గవిలజడలును • గవిలకన్నులును
దవిన యున్నవనల్లనైన దీర్ఘపుం • దనువును జూచి
యువిద గన్నుంగవ మొగిచి తెఱవక • యుండె భయమున.

ఆదిపర్వము.

ఇనుఁడు మువ్వు రింద్రులు చంద్రుఁ • డేకత సొంపునింప
నసువుగా యతి నాల్గిట ; • నగు మధురాక్కరంబు

సూర్యగణ మొకటి, ఇంద్రగణములు మూఁడు, చంద్రగణ మొకటి, నాల్గు గణములమీఁద యతి.

తనర జనకుండు నన్నప్ర • దాతయును భయత్రాత
యును నవఁగ నింతులకు మువ్వ • రొగిని నయిరి గురువు
లనఘ ! యుపనేత మఱియు ని • రంతరాధ్యాపకుండు
నవఁగఁ బురుషున కియ్యేవు • రనయంబు గురువు లైరి.

ఆదిపర్వము.

ఉపజాతులందు.—

సీ. క్రమముగా నా ఱింద్ర ♦ గణములు వాకుర్చి
యినగణంబులు రెండు ♦ కొన వచింప
నది యొక్కచరణమై ♦ యలరారు నద్దాని
నడిమికి రెండు తు ♦ న్కలుగఁ జేసి
యతి రెంట రెండింట ♦ నతుకంగఁదగు నిట్లు
తక్కిన మూడు పా ♦ దము లొనర్చి
యాటవెలఁదియొండెఁ ♦ దేటగీతంబొండెఁ
జివర నిర్మించిన ♦ సీస మగును

గీ. ఇనగణంబులు మూడు రెం ♦ డింద్రగణము
లవల నైదింద్రగణములు ♦ నాటవెలఁది
భానుగణ మొండు రెండు స్వః ♦ పతి గణములు
దినకరగణమ్ములును రెండు ♦ తేటగీతి.

ఇంద్రగణము లాఱు, సూర్యగణములు రెండు, నొకపాదమగును. దీనిని రెండు ఖండములుగాఁ జేసి మొదటిఖండమున రెండుగణముల మీఁదను మఱల రెండవఖండమున రెండింటి మీఁదను యతి నిల్పఁదగును. చివర నాటవెలఁదిగాని తేటగీతిగాని కూర్పవలయును. ఇదిసీసము.

ఒకటి పాదమునకు సూర్యగణములు మూడు నింద్రగణములు రెండును, రెండవపాదమునకు సూర్యగణము లైదుమాత్రమే. తక్కిన రెండుపాదములు నిట్లే. మూడుగణములమీఁదయతిఇదియాటవెలది. సూర్యగణ మొకటి యింద్రగణములు రెండు సూర్యగణములు రెండు మూడుగణముల మీఁద యతి. ఇది తేటగీతి.

సీ. ఈతండు వృద్ధని • యెఱిఁగి పూజించితే
వసుదేవుఁ డుండంగ • వసుమతీశ!
ఋత్విజుం డని విచా • రించి పూజించితే
ద్వైపాయనుం డుండ • ధర్మయుక్తి
నాచార్యుఁడని విన • యమునఁ బూజించితే
కృతమతుల్ ద్రోణుండుఁ • గృపుఁడు నుండ
భూనాథుఁ డనియెదు • బుద్ధిఁ బూజించితే
యాదవుల్ రాజులే • యవనిలోనఁ

ఆ. వె. పూజనీయులైన • పురుషులలోపల
నెవ్వఁ డయ్యెఁ గృష్ణుఁ • డిట్టులేల
పూజ్యులైనవారిఁ • బూజింపనొల్లక
భీష్ముపలుకుఁ జేసి • బేలవైతి.

గీ. ఉత్తమజ్ఞానవృద్ధు నా • నుండునేని
బాలుఁడయ్యును బూజ్యుండు • బ్రాహ్మణుండు
క్షత్రియుఁడు పూజ్యుఁ డమితవి • క్రమసమృద్ధి
నుర్విపతులలో నధికుఁడై • యుండెనేని.

సభాపర్వము.

జాత్యుపజాతి సామాన్యలక్షణము.—

క. తొలి యడుగు మొదల గురులఘు
వుల నెయ్యది నిల్పెఁ దాని • బూనిక మీఁద
డ్గులకుఁ మొదళ్ళఁ గ్రమ్మఱ
నిలయింపఁ వలయు జాతి • వృత్తములందుఁ.

క. విరమణముల కై యొకచో
విరచింపఁగనగును బ్రాస • విరతులు ప్రథమా
క్షర మిచ్చుచు వచ్చిన యటు
లుర వడి ననుషంగ వచ్చు • నుపజాతులలోన్.

సీ. సంస్కృతమ్మున • యందు సర్వకావ్యమ్ములఁ
బరికించి క్షేమేంద్ర • పండితుండు
విరచించె నెవ్వియో • వృత్తతిలకము; లాం
గ్రమ్ము నందుఁ గవిత్వ • యమ్ము భార
తావన్న యశక్కక • యందు వాక్రుచ్చిన
వృత్తరత్నమ్ములు • వివిధ కావ్య
సముచితక్రమములు • సరళతరమ్ములు
సర్వకవీశ్వర • సమ్మతములు

గీ. కర్ణపుటపేయములు నగుఁ • గాన వానిఁ
దెక్క నితరమ్ములైన వృ • త్తములఁ బృచ్ఛ
కులు వధానమ్ములందును • గోరఁ జనదు
విషమమాత్రా పవిత్రమా • న్యతములగుట.

ఇది శ్రీసూర్యారాయ నృపచంద్ర ముఖ్యాశ్రిత వేంకట
రామకృష్ణ విరచితంబగు సువృత్తతిలకమునందు
వృత్తావచయంబను ప్రథమవిన్యాసము.



# సువృత్తతిలకము.

## ద్వితీయ విన్యాసము.

ప్రసిద్ధము లగు వృత్తములకు లక్ష్యలక్షణములు సంగ్రహించిన పిదప నిపుడు వాని గుణదోషములు ప్రదర్శింపఁ బడుచున్నవి—

ఉ. ఆఱును నేడుఁ బాదమున ♦ కక్షరముల్ గల వృత్తమందు స
ద్వారిజసంభవాస్యములు ♦ వాస మొనర్చెదు నాగ నిల్వఁగా
నేరదు ; ఫుల్లపంకజ వ ♦ నిన్ విహరించెడు తేఁటి మల్లికా
కోరక కోటిపైఁ బడము ♦ నూర్పఁగఁగాలు నెకో యొకప్పుడున్ ?

ఉక్తాది సప్తచ్ఛందములఁ బుట్టిన వృత్తములు సరస్వతీ విశ్రామ యోగ్యములు గావని యెఱుంగునది. భారతామ్నాయమునందుఁ గవిత్రయ మష్టమ నవమ చ్ఛందములందుఁ బుట్టిన వృత్తములనైన ముపయోగపఱుపలేదు. కావుననే యప్పకవియు :—

" సీ. అడుగులకు వర్ణములు కొంచె ♦ మగుటఁ జేసి
యందు నుక్త్రప్రభృతినవ ♦ ఛందములను
బొడము వృత్తములకు వళ్లి ♦ నడులు లేవు
నాల్గు పదములఁ బ్రాసముల్ ♦ నడచుఁ గాని. "

అని యతినియమము చేయక యా వృత్తముల కనవసరయతను సూచించెను. కాని యష్టమ చ్ఛందోభవం బగు విద్యున్మాలావృత్తము నకు లక్షణముఁ జెప్పుచు:—

" శ్రీదేవిభా ♦ శ్రీప్రాణేశా !
యాదిత్యశ్రే ♦ ష్ఠాదిస్తుత్యా !
వేదోద్ధర్తా ♦ విద్యున్మాలం
బాదై మాగా ♦ ప్రాప్తిం బొల్చుఁ. "

తాను యతి నిల్పుటచే నా వృత్తమునకు మాత్రము భారతేతరగ్రంథములయందు నెందేని ప్రచారముండునని తెలియవచ్చును. సులక్షణసారమునందును యతినిబంధనము గలదు.

" ఉద్యన్మాత్రా ♦ యుక్తం బైసర్గ
విద్యున్మాలా ♦ వృత్తం బయ్యెన్ "

లేక యీ లాక్షణికులు " విశ్రామస్స్యా ద్వేద్వైర్వేదైః "
అను శ్రుతబోధోక్తమార్గము నేని యనుసరించియుందురు. ఎట్లయిననీ వృత్తము శ్రావ్యమయినదని ఫలితము.

గీ. "పాకుగువృత్తము లసమాస ♦ ములఁ జెలంగుఁ
జిన్నవి సమస్తపదములఁ ♦ జెన్నుమిగులుఁ
బండితకవీంద్రు లుపయోగ ♦ పరతఁ జేసి
యేగతిరచించిరేనియు ♦ నింపు పుట్టు."

ఉపజాతిభేదములకు సాంకర్య మెట్టులయిన నున్నదియే. అయినను బ్రథమపాదమునందలి ప్రాథ్యాక్షరము లఘువుగాఁ జేయుట హృద్యము.

మార్కండేయపురాణమునందు—

ఉపజాతి—స్వరోచిజన్మంబును ♦ వర్తనంబున్
స్వారోచిపాద్యప్రభ ♦ వంబు విన్నన్
నరుండు నిత్యోన్నతి ♦ నవ్యకీర్తి
శ్రీరమ్యుఁడై ధాత్రిఁబ్ర ♦ సిద్ధికెక్కున్.

గీ. వాఁడికొనగల దారము ♦ జాడ లఘుము
ఘమ్ము పద్యము కర్ణరం ♦ ధ్రమ్ముఁ జొచ్చుఁ

గడను ముడివడ్డ సూత్రము ♦ కరణి గురుము
ఖమ్మొక్కరించుక కర్గ్వవే ♦ ధమ్ముల జేయు.

మూడేసి యక్షరములకుఁ దెగ దోధకము మనోజ్ఞముగనుం
డును. అట్లుగాకున్నఁ దాళము దప్పినట్లు విశ్రాంతిని బాయును.

భోజరాజీయమునందు—

దోధకము—చందన కుంకుమ ♦ సంయుత వక్షా
కుందసు కుట్మల ♦ కోమల ధామా,

విఱుపులు సరి గాకుండుటకు నందే యుత్తరార్థము.

నందిత భక్తజ ♦ నప్రియయోగా
నంద యహోబల ♦ నాథ నృసింహా.

ఎడఁబడిన యల్పసమాసములఁ బృథ్వి యింపొందును, దీర్ఘస
మాసముల నదియే గాడవడఁగి పొట్టిది యగును.

ఆదిపర్వమునందు—

పృథ్వి—ఉపాంశువధఁ జేసి మధ్యము మ ♦ దోద్ధతుం జంపిని
ష్ప్రపత్నముగ ధర్మనందనున ♦ శక్షు బంధించి యే
నపాండవముగా సముద్రవల ♦ యాఖిలక్షోణి మ
త్కృపాణపటుశక్తి సత్యధిక ♦ కీర్తిని యేలెదన్.

దీర్ఘసమాసములకు నందే

పృథ్వి—శిలాంశమణికోటిసంఘటిత ♦ దివ్యదేహంబులోఁ
దిలోత్తమ యసంగ నొక్కయువ ♦ తిలలామంబు ను
త్పలాక్షి సృజియించె సర్వగుణ ♦ భాసిమూవక్రియా
కలావిదుఁడు విశ్వకర్మ దన ♦ కౌశలం బేర్పడన్.

నన్నయభట్టు పృథ్వికిఁ బండ్రెండింట యతినిల్పఁ గొందఱాత నిమార్గముగ మనింపక «వసుగ్రహయతిశ్చ పృథ్వీ» అను సంస్కృతో క్తమార్గము ననుసరించి తొమ్మిదింటయతిఁగూర్చిరి. అప్పకవి నన్న యమార్గముననే సూత్రించెను.

తొమ్మిదింట యతి నిల్పినందులకు నైషధమునందు—

పృథ్వి—చతురుముఖవిలాసినీ ♦ శయవిలాసపంకేరుహా
శుచిత్రాభృతమధూళికా ♦ సురభిసారసారస్వతా
వితీర్ణమహిమార్ణవా ♦ విభవయోగసంక్రందనా!
పరిశాపగుణభూషణా ♦ పరిణతార్థసంభావనా.

తెలుఁగా నాకారాద్యక్షరములుగల శార్దూలము శ్లాఘ్యము.

కళాపూర్ణోదయమునందు—

శా. ఆవాలుంగనుదోయి యానగుమొగం ♦ బాగుబ్బపాలిండ్ల పెం
పావేణీభర మాతనూవిలసనం ♦ బాయొప్పు లేఁ జెప్పినన్
గైవారంబగుఁగాదె కేవలశిరః ♦ కంపంబుగల్పించి యా
హా! పుట్టింపదె యిక్షుధన్వునకు న ♦ య్యబ్జాక్షి నీక్షించిరన్.

విపరీతమునకు నాముక్తమాల్యదయందు—

శా. అర్థావాగ్విబుధ మ్మహోవచనక ♦ వ్యాహార మాహావచ
స్సిద్ధ మ్మాఃకృతతాంగతఃకలి రితి ♦ శ్రీసూక్తి విద్యాధర
మిత్రద్వాదత్య మగా ల్లయంహి కుధియా ♦ మిత్థంవదత్కింనర
మ్మద్ధీరాగ్రణిగెల్పుటుత్సవమునం ♦ దయ్యో న్నభమ్మూలతయుః.

పూర్వార్థమునందుఁ బాదములు వేఱ్పడుటయు నుత్తరార్థ మునందు సమానభూయస్త్వమును శార్దూలవిక్రీడితమునకు శోభా వహము. ఆరణ్యపర్వమునందు—

శా. గీర్వాణప్రవిముక్త బాణపటల • క్రీడావిలూనంబులై
గర్వోన్మత్తసురారిశీర్షములు వీఁ • కన్ డొల్లెఁ గల్పచ్ఛిదా
నిర్వృత్తాంబుదమండలోద్ధతమహా • నిర్ఘాతపాతావధూ
తోర్వీభృద్ఘన గండశైలములతో • నూహింపఁదుల్యంబులై.

విపరీతమునకు విరాటపర్వమునందు—

శా. దుర్వారోద్యమ బాహువిక్రమరసా • స్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవి • ద్యాపారగుల్ మత్పితుల్
గీర్వాణాకృతు లేవు రిప్పు నిను దో • ర్లీలన్ విజృంభించి గాం
ధర్వుల్ ప్రాణముమానముం గొనుట త • థ్యం బెమ్మెయిం గీచకా.

మానినికిఁ బదుమూఁటను గవిరాజవిరాజితమునకుఁ బదునాల్గింటను యతిఁ గూర్చుట వాగనుశాసనసమ్మతము. కవిబ్రహ్మయీ రెండువృత్తములను నన్నయమతము ననుసరించి యేకయతికములుగను మతాంతరాశ్రయణమున యతిత్రితయసంయుతములుగను రచించెను. భారతహృదయమిట్లుండ నప్పకవి మానిని కేకవిశ్రాంతియుఁ గవిరాజవిరాజితమునకు యతిత్రయమును విధించుటకుఁ బ్రమాణము లేదు.

ఏకయతికి నన్నయభట్టారకుఁడు—

మానిని.

తమ్ములు దానును ధర్మతనూజుఁడు • దగ్గణసంభృతసత్క్రియుఁడై
యమ్మునినాథవరేణ్యునకున్ విన • యమ్మున మ్రొక్కి నమున్నతపీ
ఠమ్మున నుంచి యథావిధిపూజలొ • డంబడఁ జేసి మునీశ్వర నే
య్యమ్మున నీవిటవచ్చుటఁ జేసి కృ • తార్థులమైతిమి యందఱమున్.

ఆదిపర్వము—

కవిరాజవిరాజితము.

చనిచని ముందట నాద్యహావిర్ధృత • సౌరభధూమలతాతతులం
బెనఁగినమ్రాఁకులకొమ్మలమీఁదన • పేతలతాంతములై ననుబా
యని మధుపప్రకరంబులఁజూచి జ • నాధిపుఁడంత నెఱింగెఁదపో
వనమిదియల్లదె దివ్యమునీంద్రుని • వాసముదానగునంచు నెదన్.

ఆదిపర్వము—

ఏకయతికిఁ దిక్కనసోమయాజి

మానిని.

జూదము నప్పుడు సర్వజనంబులు • చూచి భయంపడియుప్పని యి
మ్మేదిని సేవలకుం గురుకోటికి • మృత్యువుగాని నిజం బలఁతిం
బోదని యాడరెయమ్మయినాదగు • బుద్ధికిఁదోఁచినసత్యముదా
మోదరపాటిలదేకొడుకంచుఁబ్రయోక్తులువల్కినఁ బెంపు సెదన్

కవిరాజవిరాజితము.

అనయములోలతమైవిషయప్రచ • యంబనుదుస్తరపంకమునన్
మునుఁగుచుఁదేలుచునుండఁగఁగాలము • ముట్టిరుజన్ జరనెవ్వగపై
కొన దొరకొల్పికవ్రిషంబుననంగము • కొఱ్ఱువ్వనుజెల్వను జాపి (ప్ర)రో
దనరహితంబుగఁజేసి యపాత్రపు • జావొనరించుఁగురుప్రవరా.

యతిత్రయమునకుఁ దిక్కనసోమయాజి—

మానిని.

కాలియుఁ గాంతి యు • గుర్వెఁగఁ దేజము • గుందక
వహ్నులు • గూర్శిఖా

బాల మదంగియుఁ • బాయకవెలింగెడు • చందము
నొందిరి • కల్యుఁడుఁ బాం
చాలుఁడుఁ గర్ణుఁడుఁ • బావగురుండును • శాంతన
వుండు ని • దంబునకీ
బాలుఁడు వీరిపై • భంగడచెంగున • భద్రినిఁ
గంటె సు • భద్రసుతుఁ.

కవిరాజవిరాజితము—

అనవుడు నిట్లను • నన్నరపాలున • కాతఁడు
మోతుము • నర్థిదగ
జ్ఞనులకుఁ బుట్టుట • నన్మతిఁ గోరి వి • శారదు
లాదర • నంభృతులై
యనఘు సుదుస్తర • మైన భవంబున • కచ్చగు
సీయితి • హానము తో
ధనమహనీయవి • ధంబునఁ జెప్పి రు • దాత్తగు
గాశ్రియ • కామహితా.

లయగ్రాహియందుఁ బ్రాసములకుఁగా విశ్రీవర్ణకము సాఁగనిచ్చుట సులభమై హృదయంగమముగ నుండును.

ఆదిపర్వమునందు—

లయగ్రాహి.

చందనలతామాలతరు • లందునగరుద్రుమము • లందుఁ
గదళీవనము • లందు లవలీమా
కందతరుమండపముల • యందును విలోలదర • విందసరసీ
వనము • లందు వనరాజి

కందళితపుష్పమక • రందరసముం దగులు • చుం
దనువు సౌరభము • నొంద జనచిత్తా
నందముగఁ బ్రోషితుల • డెందము లలందురఁగ • మంద
మలయానిల మ • మందగతి వీచెఁ.

శ్రీపర్వమునందు—

లయగ్రాహి.

అమ్మలును విండ్లుఁ బరి • ఘమ్ములును దోమరచ • యమ్ములును
గుంతనిక • రమ్ములుఁ గనత్ఖ
డ్గమ్ములు నహీనముస • లమ్ములును జక్రనివ • హమ్ములును
లోనగు న • నమ్రతమహోగ్ర
ప్రమ్ములును గండలును • నెమ్ములుఁ గపాలములు • నమ్రలిత
రూపకళ • లమ్ములయి సంగ్రా
మ మ్మతులదారుణవి • ధమ్మగుట దెల్పుటధి • కమ్మగుం
కలంక వ్యాద • యమ్మున కొనర్చెఁ.

నన్నయ మధ్యాక్కరకు నాల్గుగణములమీఁద యతినిల్పె నెఱ్ఱన్న మూఁడింటిపై విరతిఁ గూర్చెను. అప్పకవి యెఱ్ఱన్ననే యనుసరించెను.

నాల్గింటి మీఁద యతి నిల్పినందులకు నన్నయ—

మధ్యాక్కర.

కడు నిమ్మగా దున్ని బీజములు నల్లి • కర్షకుండున్నఁ
దడయక వర్షంబు గురిసి కావించుఁ • దత్ఫలసిద్ధి
నడుమఁ బర్జన్యుఁ డనుగ్రహింపని • నాఁడేమి సేయుఁ
గడఁగి చేయంగలదానిఁ జేయును • గాక కర్షకుఁడు.

మూటిపై యతికి నెఱ్ఱాప్రగడ—

మధ్యాక్కర.

అసదృశతేజుఁడు బ్రాహ్మ ♦ ణానీకసహితుఁడై కడఁగి
వసుమతియందునధర్మ ♦ వర్తులై యున్నమ్లేచ్ఛులను
మవలకనిజశక్తిఁజేసి ♦ మడియించిధర్మంబునిలిపి
వసునిభుండొనరించెఁజేర్మి ♦ వాజిమేధమునిష్ఠఁబొప్ప.

గణశ్రీమనియమము లేని కందాదులయందలి యవలక్షణము వీనియందపస్వరము బలె నజ్ఞుండును దెలియును. కాని యిట్టి దని పలుకనేరఁడు.

కందమునందలి యవలక్షణమునకు—

క. అంకితమోయనీకల
వేంకటపతి యిష్టమైన ♦ వేల్పుగుటఁదదీ
యాంకితము చేయుమొక్కొక
సంకేతము కాకతఁడర ♦ నన్నేఁగానే.

ఆముక్తమాల్యద—

మఱియునందే—

క. త్రివిధోత్పాతము లొదవిన
నవనివిభుఁడు విడువవలయునధికద్రవ్యం
బవనీసురముఖసురముఖ
పవనసఖముఖములభుక్తి ♦ బలిహోమవిధిన్.

పై రెండింటియందును గణభంగము లేకున్నను «అతఁడరనన్» «పవనసఖముఖముల» అనుచోట్ల ననుభవైక వేద్యముగు నపస్వరముగలదు. కందమునకు ద్వితీయ చతుర్థపాదముల మొదట జగణము

తే. భార్యయునుదానుబుత్త్రిలు ♦ పంచికొన్న
వాఁడుపసులఁబెక్కటినేలు ♦ వాఁడుకపట
కృత్యములఁబ్రముచ్చిమినిశిల్పి ♦ కృతులఁబదుకు
వారు పంక్తి దూషకులంద్రు ♦ పౌరవేంద్ర.

పాదాంతమునకన్వయము తెగకుండుటకు—

సీ. కవలలోనొకఁడొండె ♦ గాండివియొండెవృ
కోదరుఁడొండె నీ ♦ వొండెఁజేత.
గదగొని యొక్కటి ♦ కయ్యంబునకుఁబూని
యేర్పడనిలిచిన ♦ నీతనంబ
సమయంగఁజూచెదఁ ♦ గ్రమమునమీారెల్ల
నొకఁడొక్కఁడే తేరఁ ♦ బ్రకటబాహు.
దర్పంబువొగడొంద ♦ ధరఁగూలఁ్రవేయుచు
వచ్చెదమఱియు నీ ♦ వారిలోన

తే. నలిగియెవ్వఁడుదాఁకిన ♦ నట్లనాదు
గదకునరసేసిపేర్చెదఁ ♦ గడుగదార
ణంబునాతోడఁజేయుమ ♦ నస్త్రహారుండు
గడఁగలేఁడుమీాకెందుఁబోఁ ♦ గలదునేఁడు.

శల్యపర్వము.

గీ. ఇట్టులుద్దేశలేశముఁ ♦ బట్టియేము
కింతవచియించితిమి, బుధు ♦ లీవిధముగ
నఖిలముయథోచితముఁదెలి ♦ యంగవలయుఁ
గలదె? కవితానముద్రముఁ ♦ గడవనావ
మొదటిగురువులఘుద్వయ ♦ మ్ముగనొనర్ప

నుత్పలరుచంపకమ్ముగా ♦ నొప్పు; నస్ర
గ్ధరావృత్తమునఁ మహా ♦ స్రగ్ధరయగు
నిర్దుశార్దూలమనఁగు మ ♦ త్తేభముగను
దేజరిలుఁగ విరాజవి ♦ రాజితముగ
మానినీవృత్త, మట్టులే ♦ మత్తకోకి
లమ్ము తరళమ్ముగం, జంప ♦ కమ్ముతుదిని
నాలుగక్షరములువీడ ♦ నర్కుటమగుఁ
గవులుదీనినకోకిల ♦ కాకమందు
రిట్టిదశలము నిలవచి ♦ యింపలేదు
చెప్పఁగానేల? యది న్వత ♦ స్సిద్ధమొకద
వృత్త వేదికి, నొరునకు ♦ వినుపనేల?

క. నానావిధగుణవి
జ్ఞానులకుఁ దోషలేశ ♦ గతిచతురులకుం
గానిసూక్ష్మశమ్ములు
నేనివచించితిమిహయోగి ♦ హృద్గమ్యములన్.

ఇది శ్రీ సూర్యారాయనృపచంద్రముఖ్యాశ్రిత
వేంకట రామ కృష్ణ విరచితంబగు
సువృత్త తిలకమునందు
గుణదోష దర్శనంబను
ద్వితీయవిన్యాసము.



నిలుపగతి కుంటువడిన ట్లగపడునుగాని యించుక గమకించి చదువనతి సుందరముగ నుండును.

క. అనుపమనియమాన్వితులై
యనూనదక్షిణలఁ గ్రతుస ♦ హస్రమ్ములుచే
సినవారికంటె నక్రో
ధనుఁడ కరంబధికుఁడండ్రు ♦ తత్త్వవిధిజ్ఞుల్.

ఆదిపర్వము.

గీతములందలి యవలక్షణమునకు—

తే. వనరుశాకాయలవణాయ ♦ వా యటంచుఁ
బెనఁగుధూళీపరగృహోద ♦ కియనునాస
మించి యీఁగికుఁగాటువా ♦ మునకు బలిచు
సొనఁగఁ దలిభర్త్రై పొక్కు ♦ నువిదమదిని.

ఇందు 'ధూళీపరగృహోదకియన నాస' అనుచోట శ్రోత్రగ్రాహ్యమగు నపస్వరముగలదు. ఇట్లే సీసము మొదలగువానియందును దెలియునగు. పాదాంతమునందుఁ బదవిరామముసేయక పదమధ్యమున యతిస్థానములు గూర్చుట ప్రౌఢి.

మ. బకవిధ్వంసనమాచరించితి, హిడిం ♦ బప్రాణముల్గొంటి, కీ
చకనిర్మూలనకేలినల్పితి, జరా ♦ సంధాంగకస్ఫైర్యరోధం
బకలీలన్విలసిల్లి, తీవని మను ♦ ష్యస్ఫూర్తిమాత్రమ్ముతే
మొకమర్త్యుండనురెట్లునీకుమతిలో ♦ నూహింపకిట్లాడితే.

సీసపద్యమునందుఁ బ్రతిపాదమునంత్యపదము నన్వయమును దెగుట రమణీయము.

సీ. తొడరినవాఁడైన ♦ దోర్బలంబునఁదన్ను
మిగులంగనీఁడను ♦ మేటిమాట
యమరేంద్రునర్ధాస ♦ నమునకునైనన
ర్హుండెంతయును నను ♦ గూఢిమాట
జమునిలుసొచ్చిన ♦ జంతువునైనను
గాచునెమ్మెయినను ♦ రాచమాట
దనుఁగోరియూర్వశి ♦ దానవచ్చిననైన
లోలుండుగాఁడను ♦ మేలిమాట
తే.గీ. శౌర్యవైభవప్రాభవ ♦ శౌచములకు
నొరులకైనగైవారమై ♦ యుల్లసిల్లు
నొక్కనికినివియొల్లను ♦ నిక్కమట్టి
పొందఁగలుగునె యర్జును ♦ నీడువాఁడు॥

విరాటపర్వము.

పాదాంతమునఁ బదము తెగకుండుటకు—

సీ. జూదరిగరదుండు ♦ వేదంబు సదువని
వాఁడువడ్డికినిచ్చు ♦ వాఁడుగాయ
కుండుగ్రామము పనిఁ ♦ గుడుచునాతఁడుగృహ
దాహికుష్ఠముగల ♦ తనువునాతఁ
డలుఁదేవుళ్గొన్నాతఁ ♦ డఖిలవస్తువులును
నమ్మునతఁడు సో ♦ మమున్మ్రొక్క
యించినయతిఁదబ్బి ♦ నంచారలాభోప
జీవకుండుర్వీశ ♦ సేవకుండు

విరాటపర్వమునందు—

మ. విలసద్గాండివచాలనోద్ధతిగన ♦ ద్దివ్యద్యుల్లతాలీలగా
నలఘుస్ఫారకపిధ్వజధ్వని సము ♦ ద్యద్గర్జ చందంబుగా
జలదాకారత నొందెఁ దేరితఁడు ప ♦ ర్జన్యాకృతిం బొల్చె దో
ర్బల తీవ్రారిపదాఘదుర్విషహగ ♦ ర్వస్ఫూర్తి నిగూఢమూర్తిగాన్.

శా. యోధాగ్రేసరుఁ డిద్ధతేజుఁడు రణో ♦ ద్యోగానురక్తుండు దు
స్సాధప్రక్రమబాహువీర్యుఁడు గురు ♦ క్ష్మాపాలవాల్లభ్యల
క్ష్మీధామాత్ముఁడు జామదగ్న్యకలిత ♦ శస్త్రాస్త్రవిద్యాఢ్యుఁడీ
రాధేయుం డొకచీరికింగొనఁడు వీ ♦ రవ్రాతముం బోరులన్.

ఘోరయుద్ధాదికమును వర్ణించునపుడు స్రగ్ధరా మహాస్రగ్ధరలు వాడుదురు.

ఆరణ్యపర్వమునందు—

స్రగ్ధర.

లంకాలుంటాకుఁ డుద్య ♦ ల్లఘుతరగమనో ♦ ల్లాసియై డాసి వీఁకం
బొంకం బేపారఁ జంచ ♦ ద్భుజరచితమహా ♦ భూరుహం బెత్తి వ్రేసెం
గింకన్ధూమ్రాక్షువాఁడుం ♦ గెడసెను వదనో ♦ త్కీర్ణకీలాలధారా
పంకప్రాగ్భారమగ్నా ♦ వఘునవిఘటిత ♦ ప్రాణుఁడై యాహవోర్విన్.

మహాస్రగ్ధర.

కని ధూమ్రాక్షుండు విశ్వ ♦ గ్గననరసలన ♦ త్కాలమేఘంబవోలెన్
ఘనమార్వీఘోష గర్జం ♦ గడఁగి శరశతా ♦ కల్పితాసారదుర్ద
ర్శనవీరారంభుఁడై నా ♦ సకలహరిచమూ ♦ సంఘమున్విహ్వలంబై
చనఁగూలెందూలెలావుం ♦ జలమును జెదర ♦ న్సందడిన్విచ్చెనోచ్ఛ్వాస

కృత్యారంభమున శార్దూలవిక్రీడితమునఁ గాని నుత్పలమాలికఁ గాని వ్రాయుదురు.

మనుచరిత్రమునందు—

శా. శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ • జెన్నొంద విశ్వంభరా
దేవిం దత్కమలాసమీపమునఁ బ్రీ • తిన్నిల్పినాఁడో యనం
గా వందారుసనందనాదినిజభ • క్తశ్రేణికిం దోఁచు రా
జీవాక్షుండు కృతార్థుఁ జేయుశుభదృ • ష్టిం గృష్ణరాయాధిపున్.

విరాటపర్వమునందు—

ఉ. శ్రీయన గౌరినాఁ బరఁగు • చెల్వలచిత్తము పల్లవింపభ
ద్రాయితమూర్తియై హరిహ • రంబగురూపముఁ దాల్చివిష్ణురూ
పాయ నమశ్శివాయ యని • పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పర • తత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

ద్వితీయాద్యాశ్వాసములకు మొదలఁ గందముఁ జెప్పెను.

భాగవతమునందు—

క. శ్రీకంఠచాపఖండన
పాకారిప్రముఖ వినుత • భండన భీమా
కాకుత్స్థవంశ మండన
రాకేందుయశోవిశాల • రామనృపాలా.

సూర్యచంద్రోదయ పరిశ్రమసురతాదివర్ణనముల సీసము గూర్చెను.

విరాటపర్వమునందు—

సీ. నీరజాకరములు • నిష్ఠమైఁ జేసిన
భవ్యతపముల • ఫలమునంగ

## తృతీయవిన్యాసము.

—:o:—

తే.గీ. గోపరహితమ్ములను గుణ • భూషితములు
నగు సువృత్తములను ముత్తి • యములఁ బోలెఁ
దగిన పట్టులఁ గూర్ప నెం • తయుఁ బ్రబంధ
మతిశయిల్లు సుదృగ్మనో • హారి యగుచు.

శాస్త్రము, కావ్యము, శాస్త్రకావ్యము, కావ్యశాస్త్రము నని వాఙ్మయము నలుదెఱంగులు గలది.

సర్వకావ్యలక్షణములు దెలుపునది శాస్త్రము.

రసాలంకారయుక్తము కావ్యము.

ఎల్లపురుషార్థముల నుపదేశించునది శాస్త్రకావ్యము.

భారతము మొదలగునది కావ్యశాస్త్రము.

చేఁదుమందుపైఁ జక్కెరపూఁతవలెఁ గొందఱు కేవలశాస్త్రమునందున గావ్యలక్షణము సూపుదురు. అందఱకుఁ దేటతెల్లముగాఁ దెలియుటకై శాస్త్రమును గీతాదిసుకరవృత్తములతోఁ రచింపవలయును.

కావ్యమునందును గావ్యశాస్త్రమునందును వర్ణనముల కనుగుణముగ వృత్తము లుపయోగింపవలయును. శాస్త్రకావ్యమునందతిదీర్ఘవృత్తము లనావశ్యకములు.

క. వినుము కవిప్రభుశాసన
మునఁ జేసి యనర్హవృత్త • ములు సహ్యాశ్వ
మ్ములగను గోగ్రహమున న
ర్జునురథ్యము లవ్విరాట • సుతురథ్యములే.

ఉ. ఐన నవస్థకుందగిన ♦ యట్టిసువృత్తములం బ్రిబంధముల్
జానగు సాధుపూరుషుల ♦ చందమునం దమకంబుపేర్మి న
స్థానమునన్సువృత్తమణి ♦ దామకమున్మొలనూలి గుత్తకం
బూనిచినట్లు గూర్పనది ♦ బుద్ధివిహీనతఁ జాటిచెప్పిరుట్.

కావున నిపుడు వృత్తములందగుచోట వినియోగపఱుచు విధము దిజ్మాత్రిముగ నుదాహరించెద.

ఆశ్వాసాంతమున మాలినీవృత్త మనుప్రాసభేదములతో నె క్కులుపవలయును.

విరాటపర్వమునందు—

మాలిని.

నిగమకుసుమగంధో ♦ న్మేషపూతాభిధానా
సగుణవిగుణలీలా ♦ సామ్యసాక్షిత్వనానా
జగదవనవిధాన ♦ స్థైర్య దత్తావధానా
నగశరధినివాసా ♦ నందనంస్తూయమానా.

సక్రోధ ధిక్కారమునఁ బృథ్వీవృత్తముచాలియుండును.

ఆదిపర్వమునందు—

పృథ్వి.

ఉపాంశువధఁ జేసిమధ్యము మ ♦ దోద్ధతుంజంపి ని
స్సపత్నముగ ధర్మనందను న ♦ శక్తు బంధించి యే
నపాండవముగా సముద్రివల ♦ యాఖిలక్షోణి మ
త్కృపాణపటుశక్తి సత్యధిక ♦ కీర్తినె యేలెదన్.

నృపాదులశౌర్యమును గొనియాడునపుడు మత్తేభ శార్దూల విక్రీడితములు సంమతములు.

దివసముఖాభినం ♦ దిత చక్రయుగ్మక
మ్ముల యనురాగంపుఁ ♦ బ్రోవనంగ
హరిహరబ్రహ్మమ ♦ హానుభావమ్ములో
కూటిగాఁగఁగరఁగిన ♦ గట్టియనఁగ
నతులవేదత్రయ ♦ లతికాచయము పెను
పొందఁబుట్టెడు పూల ♦ కందమనఁగ
తే. గీ. నఖిలజగముల కట్టెఱ్ఱ ♦ యగుచు జనస
మాజకరపుట హృదయస ♦ రోజములకు
ముకుళనంబును జృంభణం ♦ బును నొనర్చి
భానుబింబంబు పూర్వాద్రి ♦ పై వెలింగె.

ద్రోణ పర్వమునందు——

సీ. నలువచెందొవల రే ♦ కులకు నన్నువువెట్టఁ
గోరికావించిన ♦ గుళికయనఁగ
నఖిలద్విజశ్రేష్ఠ ♦ మగుచకోరచయంబు
తపముసముల్లస ♦ త్ఫలమనంగఁ
జిగురుజొంపమునను ♦ జిగియొప్పనుదయాద్రిఁ
బొలుపారునవకల్ప ♦ భూజమనఁగఁ
బూర్వపయోరాశి ♦ పొంతఁగెంజాయచె
న్నొదవిన పవడంపుఁ ♦ బొదయనంగ
తే. గీ. నరుణరుచిఁ దనమండల ♦ మతిశయిల్లఁ
బొడిచిదివిఁబ్రాఁకి దీధితు ♦ లడరఁజేసి
యంతకంతకు నెక్కుచు ♦ నంతమసము
గ్రాలుకొననీక చంద్రుండు ♦ గ్రాలెనధిప.

శృంగారనైషధమునందు—

సీ. పతిపాణిపల్లవ ♦ చ్యుతనీవిబంధన
వ్యగ్రబాలాహస్త ♦ వనరుహంబు
ధవకృతాధరబింబ ♦ దశనక్షతవ్యథా
భుగ్నలీలావతీ ♦ భూలతంబు
ధరణీనాయకభుజా ♦ పరిరంభమండలీ
గాఢపీడితవధూ ♦ ఘనకుచంబు
వరనఖాంకుర మృదు ♦ వ్యాపారపులకిత
నీరజాక్షీ నితం ♦ బోరుయుగళి
ఆ. గీ. యస్తివామ్యభార ♦ మస్తికౌతూహలం
బస్తిఘర్మసలిల ♦ మస్తికంప
మస్తిభీతియస్తి ♦ హర్షమస్తి వ్యథం
బస్తివాంఛమయ్యె ♦ నపుడు రతము.

వనవిహారమున సంవాద వైఖరి రగడభేదములు వ్రాకుత్తురు.

చంద్రికాపరిణయమునందు—

* చెలువచెలువపుమొగ్గచాల్కొని ♦ చేరుచేరుగఁ గూర్చివిచ్చట
నలినినలినిభకుంతలామణి ♦ నన్నునన్నులు వేడముచ్చట
తిలకతిలకకులంబుగన్గొన ♦ దివ్యదివ్యాగములపోలిక
నలరునలరుల నెనయురోలం ♦ బాళిబాళి చిగుర్పచాలిక
యింతియింతిటఁజేరఁ దగదెసు ♦ మేరమేరయె వకుళపాళిని
కాంతకాంతవశరములల్లవె ♦ కాంతకాంతమె చాలహాళిని

* భారతమునందు రగడలు లేమిఁ దల్లక్షణము ప్రథమవిన్యాసమునఁ జెప్పంబడదయ్యె.

సీ. సంస్కృతకవయితల్ ♦ సర్గముకడవెళ్ళ
విషయానుగుణముగా ♦ వృత్తమొకఁడె
హావణింతురట్లుగా ♦ కాంధ్రకవీశ్వరుల్
తలఁచు సీసమ్ముగీ ♦ తద్వయమ్ము
శార్దూలమత్తేభ ♦ చంపకోత్పలములు
కందమ్ము సీయష్ట ♦ కంబెకూరు
రవివక్షితమ్ముగా ♦ నటుగానవానికి
నరిదివక్ష్యానుగు ♦ ణ్యమ్ముదెల్ప

గీ. నయిననుద్దేశలాభము ♦ నధిగమించి
కొన్నిటికిలక్షణంబిందుఁ ♦ గూర్పఁబడియెఁ
దక్కువై చిత్రమాత్రపా ♦ త్రమ్ములయిన
వృత్తముల వినియోగము ♦ వినుపలేదు.

గీ. గీతకంద సీసమ్ములు ♦ కేవలముగఁ
గైకొనిరచింపుదురు శత ♦ కములుమాత్రి
కలపి రేనియుఁ జంపకో ♦ త్పలములట్లు
తుల్యజాత్యమ్ములను గల్పి ♦ దురు సుకవులు.

చ. అనియిటుసర్వవృత్తముల ♦ యందుఁబ్రసంగముగల్గు వర్ణ్యవా
క్షనులకు మేలివృత్తములఁ ♦ గావ్యములన్ విభజించుపద్ధతిన్
వినిచితి: మొంటరెండిటనో ♦ వృత్తములన్ శ్రమపడ్డవారు ని
ర్ధనులవిధంబునం బనికి ♦ రారు యథా వినియోగధోరణిన్.

గీ. తనకునలవాటు గలుగు వృ ♦ త్తమ్మునందె
తనదు సందర్భమునుదెల్పఁ ♦ దగు; మఱొంటఁ
బూరణము సేఁతయేకాక ♦ పొలువుపుట్ట
దొకట నేయాదరము పూర్వ ♦ లకును గలదు.

సీ. పొలుపుగాఁ జంప కో ♦ త్పలమాలి కల్గూర్చ
దిట్టండు నన్నయ ♦ భట్టసుకవి
యందమ్ముమీఱఁ గాఁ ♦ గందంమ్ము రచియింప
శూరుండు దిక్కన ♦ సోమయాజి
చక్కఁగా మత్తేభ ♦ శార్దూలములనాడ
ఖ్యాతుండు బమ్మెర ♦ పోతరాజు
వాసి యెసంగఁగా ♦ సీసమ్ములందీర్ప
విన్నాణి శ్రీనాథ ♦ విబుధహేళి

గీ. సకల వృత్తములంగూర్ప ♦ జాణలయ్యు
నీవిధమ్ములఁ బూర్వక ♦ వీశ్వరులున
వేడుకగలారు కొండొక ♦ వృత్తములను
సుందరులు రత్నహారము ♦ లందుఁ బోలె.

చ. అనువగుచోట్ల వృత్తములు ♦ లచ్చుపడంగ సువర్ణవస్తువుల్
దనరు నమర్లసదుచ్చిని ♦ తాంతముఁ ; గావున నిందుమేము సె
ప్పిన వినియోగమార్గమును ♦ పీడక వృత్తనివేశ నమ్మొనన
ర్పను నమకట్టుఁడీ కవులు ♦ వశ్యవచోవిభవుల్ కృతజ్ఞతన్.

గీ. ఈవగిదిఁ నర్థులకు, బ్రీతి ♦ మోపయోగి
విబుధగణమునకును సువి ♦ వేకకారి
కవికులేశ్వరులకునైన ♦ వివిధ సూత్ర
తత్త్వ నిర్ధారణావార్ష ♦ దాయివెలసె.

ఇది శ్రీసూర్యారాయ నృపచంద్ర ముఖ్యాశ్రిత
వేంకటరామకృష్ణ విరచితంబగు సువృత్త
తిలకమునందు వృత్తవినియోగంబను
తృతీయ విన్యాసము.

